
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120021555



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విశ్వశాంతి శతకము



డా॥ వెల్లంకి ఉమాకాంత శాస్త్రి
ప్రొఫెసర్, గణిత శాస్త్ర విభాగం
ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి
ఖరగ్‌పూర్

# అంకితము

అమ్మ సరసిజ భవు రాణి యఖిల వేద
నాద సంతోషిణీ దివ్య నాట్య గీత
కావ్య సంధాన కారిణి ఘన పురాణ
శాస్త్ర విజ్ఞాన రూపిణీ జయము జయము.

అమ్మా! శారదా! భక్తితో
ఈ విశ్వశాంతి శతకాన్ని
నీకు కానుకగా సమర్పిస్తున్నాను.

# తొలిపలుకులు

సాహిత్యము, సంగీతము, నాట్యము, చిత్రలేఖనము, శిల్పము- ఈ ఐదు కళలూ సరస్వతికి పంచప్రాణాలు. భారతీయ సంస్కృతికి ఆధారాలు. మన పూర్వులు వేద వాఙ్మయంలోనే ఈ కళల క్రొక్క స్వరూపాన్ని సంతరించారు. అందరికీ వేద వాఙ్మయం అందుబాటులో ఉండకపోవటం వలన కావ్య, ఇతిహాస, పురాణ వాఙ్మయాన్ని సృష్టించటం జరిగింది.

మనిషి ఎల్లప్పుడూ నవ్యతనూ, సూక్ష్మంలో మోక్షాన్ని కోరుకుంటాడు. తథాస్తు. ఈ రకం ప్రయత్నంలోనే కడచిన పది శతాబ్దాలలో ఎందరో ఎన్నో శతకాలను వ్రాశారు.

శతక మనగా నూరు పద్యములు గల గ్రంథము. ఇట్టి వాటిలో సుప్రసిద్ధమైనవి సుమతీ శతకం, వేమన శతకం, భాస్కర శతకం మున్నగునవి. ఇవన్నియూ సరళమైన భాషలో నుండుట వలన, నీతి వాక్యములతో నిండియుండుట వలన, పసితనములో ఇట్టి పద్యములు చదువుకున్నవారి హృదయములలో ఆ నీతులు చిరస్థాయిగా నిలిచిపోయి, మానవత్వపు విలువలను పరిరక్షించుచున్నవి.

అయిననూ కాలము మారినది. ప్రస్తుతము సమాజము సైన్సు మరియూ టెక్నాలజీతో పరుగులు తీయుచూ ఒత్తిడికి గురి యగుచున్నది. సమాజములోని క్రొందరు కుల మత భేదములను కుంపట్లను

రగుల్చుచున్నారు. మరికొందరు స్వార్థముతో సమాజమును దోచుకొను చున్నారు. సమాజములో అవినీతి పెరుగుచున్నది. ఆధ్యాత్మిక చింతన తరుగుచున్నది. ఇట్టి తరుణములో నీతిదాయకమైన శతకముల ఆవశ్యకత ఇంకనూ ఎంతగానో ఉన్నది.

నేను రచించిన ఈ శతకం పిన్నలకూ, పెద్దలకూ ఆనంద కరమై, విశ్వశాంతికి దోహదము చేస్తుందని ఆశిస్తున్నాను.

ఇట్లు
భవదీయుడు
వెల్లంకి ఉమాకాంత శాస్త్రి

హైదరాబాద్
15-2-1995

---


మా యింటి అడ్రసు :

1. **Dr. Vellanki Umakanta Sastry**
   **C 1.17, I. I. T. Campus**
   **KHARAGPUR - 721 302, W. B.**

2. **డా॥ వెల్లంకి ఉమాకాంత శాస్త్రి**
   ప్లాట్ నెం. 36, ప్రశాంతి నగర్
   డాక్టర్ ఏ. ఎస్. రావు నగరు వద్ద
   **E. C. I. L. పోస్టు**
   హైదరాబాద్ - 500 762

ఎల్ల జీవకోటి నెవరు సృజించిరో
ఇట్టి విశ్వ మెటుల పుట్టె ననుచు
తలచి చూడ నంత దైవము కనిపించె
విశ్వ శాంతి కోరి విను మనీషి.

నిన్ను నీవు తెలియ నేరక యున్నంత
నివురు గప్పి నట్టి నిప్పు వీవు
తెలిసి కొన్న నీవు దివ్యమౌ జ్యోతివి
విశ్వ శాంతి కోరి విను మనీషి.

దారి చూపు వెల్గు దూరాన లేకున్న
తీర మెట్లు నావ చేర గలదు
గురువు దేవుడనుచు గురుతింపు మాత్మలో
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఆత్మ నియతి లేక నద్దముగా వెత్తి
గొడ్డు కొన్న చేను బడ్డ పగిది
మేయ జూడ నీకు ధ్యేయమ్ము తెలియదు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

అంత రంగ మందు హరి హరు గనలేక
పరువు లెత్త నేల ధరణి యెల్ల
చంక నున్న బిడ్డ సంగతి మరతువా
విశ్వ శాంతి కోరి విను మనీషి.

వేద శాస్త్రములను వెళ్ళగా చదివియు
నాత్మ శుద్ధి లేక హద్దు మీరి
నడచు వాని గాంచి బడి యేల ననరాదు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఋషులు పెద్దలెన్నొ ఋక్కులు చెప్పిరి
స్వర సమంచితముగ సత్య నిరతి
వారి దారి నెరిగి భద్రముగా పొమ్ము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

నేను యోగి నంచు నే యోగి నంచును
విఱ్ఱవీగు వాడు వెఱ్ఱి వాడు
జగతి మేలు గోరు జనులెల్ల యోగులే
విశ్వ శాంతి కోరి విను మనీషి.

జగము మాయ యనెడు సత్య మెఱింగిన
మనసులోన దోచు మంచిదారి
అంత నాత్మ సచ్చిదానంద మయమగు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

అక్షరాలు జూచి యవి నాకు రావని
పరువు లెత్తు వారి బట్టి ఎవడు
దిద్ద బెట్ట గలడు దిక్కు వారి కెవరు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

వారు చెప్పు లేదు వీరు చెప్పగ లేదు
దూర ముంచి రనుచు దూఱ వలదు
బోయ కులము లోన పుట్టదే వాల్మీకి
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చదువు కొనక బుధుల సాంగత్య మెఱుగక
వీథు లందు తిరిగి వెఱ్ఱి ముదిరి
చెరచి రితరు లంచు చెడు మాట లాడకు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చదువు లందు నున్న సారము శ్రద్ధతో
పొంద చూడ వలయు పోయినట్టి
కాలము మరి రాదు కాల ధర్మ మ్మది
విశ్వశాంతి కోరి విను మనీషి.

పరుల సొమ్ము చూచి పటిక బెల్ల మటంచు
మ్రింగ వలదు దాని దొంగిలించి
కఱ్ఱు కాల్చి వాత కాలమే పెట్టును
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పరుల సంపదలను పరపతులను చూచి
ఈర్ష్య పడుచు నిజము నెఱుగకుండ
వాడి తాత దోచి నాదని తెగడకు
విశ్వశాంతి కోరి విను మనీషి.

బలిమి కలదటంచు కలవాడ నేనంచు
విఱ్ఱవీగ వలదు విధిని దాటు
తరము కాదు ఘనులు దానవు లేమైరి
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎదుటి వారు నిన్ను నెదలోన నమ్మిన
గొంతు గోయ కాత్మ చింత వీడి
కటిక వాడు వృత్తిగా చేయు పనియది
విశ్వ శాంతి కోరి విను మనీషి.

నీవు త్రాగి పోరల నీ బిడ్డ లెట్టుల
బువ్వ తిందు రయ్య పుట్టి నపుడె
వారు కూడ త్రాగి వసుధపై నేడ్తురు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

గుణము బట్టి కులము కొనుమని దేవుండు
తెలిపె నెపుడొ దాని తెలియ లేక
కుల విభేద మెంచ కొలబద్ద పట్టకు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఒక కులమ్ము పెద్ద యొక్క కులము చిన్న
అనుచు వ్యాకులమ్ము నంద వలదు
వృత్తి చిత్తవృత్తి వేర్పాటు కుల మంతె
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎవడు లోక హితమునే కోరి సత్యము
దెలిసి ప్రజకు మేలు సలుపు నతడు
బ్రాహ్మణుండు లోక బాంధవు డాతడు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎవడు బలము చేత నీ దేశ మాతను
రక్షణమ్ము సేయు దక్షుడగునో
అతడె రాజ కులజు డన నొప్పు ధరలోన
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎవడు తిష్ఠ వేసి యిలపైన నెసగెడు
వస్తు జాలముల సమస్త జీవ
కోటి కమ్ము నతడె కోమటి యన నొప్పు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎవని కాళ్ళు చేతు లీ ధరిత్రిని దున్ని
పంట పండ జేసి ప్రజల కెల్ల
అన్న మొసగు నట్టి యార్యుడే శూద్రుడు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చచ్చి పోయి నట్టి జంతు సంపద తోడ
బ్రతికి యున్న వారి పాదములకు
చెప్పు లమర జేయు జీవి పంచము డయ్యె
విశ్వ శాంతి కోరి విను మనీషి.

తల్లి దండ్రి నాదు తాతలు బ్రాహ్మలు
అనుచు నీల్గ బోకు మాత్మ లోన
నలరు వాని గన్న యాతడు బ్రాహ్మడు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

వృత్తి వలన కులము వెలసిన యంతనే
పుటుక తోడ కులము పోవు నపుడు
నీదు గుణము తెలుపు నిజమైన కులమును
విశ్వ శాంతి కోరి విను మనీషి.

మనసు చంద్రుని వలె మహితమౌ శాంతితో
నుండ జేసి దాని నుర్వి జనుల
శ్రేయమునకు వాడు జీవుడు దేవుడు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఉర్వి లోన నసురు డుద్భవ మందిన
వాని మట్టుబెట్ట పూని నంత
జనుల వాక్కు వజ్ర సన్నిభమై యొప్పు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎఱుక లేని మనిషి యిది మంచి చెడుగని
తెలియ లేక చేయు నలతి పనులు
అగ్ని రగులు కొన్న యప్పుడు వగచును
విశ్వ శాంతి కోరి విను మనీషి.

తప్పు చేయు వాని దండించ వలసిన
సమయమందు మనిషి జ్ఞాని యగుచు
అగ్గి వంటి మాట లాడుట ధర్మము
విశ్వశాంతి కోరి విను మనీషి.

అయ్య చేత జిక్కె నధికార మనుచును
విఱ్ఱ వీగ వలదు వెఱ్ఱి యెత్తి
పరుల తప్పు లెంచ పరుగులు తీయకు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

హద్దు మీరి నీవు హరి హరు డెవడు నా
కడ్డు నిలువ గల డటంచు నహము
హెచ్చ బలుక నపుడె వచ్చును మోసము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చీక టింట నుండి జీవుడు నిద్రింప
దొంగ లెల్ల కొంప దోచుకొంద్రు
వెలుగు లోన గన్న వెఱచి పర్వెత్తరే
విశ్వ శాంతి కోరి విను మనీషి.

సాత్వికమ్ము సత్య సంధత మర్యాద
పెద్ద మనిషి తనము ప్రేమ నయము
మనుజుని కడ నొప్పు దమజున కవి యేల
విశ్వ శాంతి కోరి విను మనీషి.

తనకు తెలిసినంత ధరలోన నేరికి
తెలియ దనుచు వెఱ్ఱి తలకు నెక్క
నిక్కి చూచు వాడు చుక్కలు లెక్కించు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

తామసమ్ము తోడ దర్పమ్ము పెచ్చుగా
లోక మెల్ల తనకు లొంగ వలయు
ననుచు దలచు వాని యంధత్వ మేమందు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

సాత్వికమ్ము దైవ సన్నిధిలో నొప్పు
రాజసమ్ము యుద్ధ రంగ మందు
రెండు కలియ మనిషి నిండైన వాడగు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

నేతి నేతి యనుచు రాతిరి పవలును
తర్క బుద్ధితోడ తరచు చుండ
గరళ ముప్ప తిల్లు కాలము హరియించు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

స్వార్థ బుద్ధితోడ వచ్చు శృంగారము
బట్ట బయలు చేయు నట్టి రచన
చేసి నిప్పు తోడ చెలగాట మాడకు
విశ్వ శాంతి కోరి విను మనీషి

ఇల్లు గాలి పోయి ఏడ్చుచు నొకదుండ
చుట్ట కాల్చు కొనగ చూచు నొకడు
హీను డైన వాని పూనిక యీ తీరు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

మాట దాటు కోటి కోట యగర్తల
చేత దేవ వస్త్ర రీతి దోచు
హేయమైన రాజ కీయ తత్వమ్మిది
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పొట్ట నిండి నంత పుట్టును మదిలోన
ఇల్లు నింప తలపు హృదయ మందు
పెరుగు నంత కోర్కె పెనుభూతమగుచును
విశ్వ శాంతి కోరి విను మనీషి.

కర్మ చేసి ఫలము కావలె నని కోరు
వాడు మనిషి దాని జాడ గనక
ఈయ దేమి దేవు డేమిరా యనరాదు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

శక్తి మీరి కోర జగతిలో దానిని
పొంద లేవు కాని ముందు జన్మ
మందునైన దాని నందగా కష్టించు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఒక్క నాడు కోటి కెక్కిన వాడెవ
డాత్మ శుద్ధి తోడ నహరహమ్ము
యత్న మీవు సేయు మాపైన హరియుండు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఆలు చూలు లేక నవని సంతతి గోర
నర్హ మగునె అద్ది గర్హనీయ
మాత్మ కర్మ లేక నందునే ఫలితము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

కలసి వచ్చు నట్టి కాలము గల జీవి
చేయు పనులు చెఱకు చేను బోలు
కాని వేళ నద్ది గహనమై తోచును
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పరవశించి యులిని పట్టి రాతిని కొట్టి
శిల్ప మొకటి చేసి చెలగు మనిషి
విశ్వ శిల్పి యైన వేల్పును చూడదే
విశ్వ శాంతి కోరి విను మనీషి.

కుంచ బట్టి రంగు కొంచెము కొంచెము
పూసి చిత్ర మేసి చూసి మరియు
మనిషి శివుని గనడె మనసు నిల్పిన యంత
విశ్వ శాంతి కోరి విను మనీషి.

కలము పట్టి హృదయ గతమైన భావాల
సంతరించి మధుర శబ్ద జాల
కలిత రచన చేయు కవి కనడే హరిన్
విశ్వ శాంతి కోరి విను మనీషి.

కంఠ మెత్తి మధుర గానమ్ము పాడుచు
మురియు మనిషి జగతి నెఱుగకున్నె
కోకిలమ్మ కెవరు గొంతిచ్చిరో యని
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చేతులార తాను చేసిన చక్కని
వస్తువు గని లోన పరవశించు
నతడు కనడె బ్రహ్మ నంతరంగమ్మున
విశ్వ శాంతి కోరి విను మనీషి.

వెజ్జు గుండె గోసి వేరొక్క దానిని
పొందు పరచు రోగముల హరించు
అట్టి ప్రాజ్ఞు డీశు నాత్మలో జూడడే
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చేయు పాపములకు శీర్ణమై కాయము
పోక యుండ బుద్ధికాక యుడుగ
ఇచ్చు కాన్కల గని మెచ్చునా దేవుడు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎట్టి వృత్తినైన నిలపైన నొనరించి
తిండి తినెడు దేహి నిండు మనిషి
అటుల గాక యున్న నా జీవి రాక్షసి
విశ్వ శాంతి కోరి విను మనీషి.

తిన్న తిండి యరుగ దేహము కష్టించి
పని యొనర్ప వలయు పాటు పడక
యున్న బొజ్జ పెరుగు నుర్వికి భారమై
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పచ్చి గడ్డిమేసి పది మందికిని మంచి
పాలనిచ్చు నట్టి పశువు లెల్ల
పూర్వజన్మ నేమి పుణ్యము జేసెనో
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చందనమ్ము కట్టె గంధ మొసంగును
సభ్యమైన మనిషి సఖ్యమిచ్చు
దుర్జనుండు పాము వర్తింపవలె వాని
విశ్వ శాంతి కోరి విను మనీషి.

దారిబోవు వారు కూరిమి చుట్టాలు
కలిమి బలిమి నీకు కలిగినపుడు
అటులగాక యున్న నాప్తులే శత్రువుల్
విశ్వ శాంతి కోరి విను మనీషి.

మరతు మన్న మరపు మదిరాదు పెరవారు
పెట్టి నట్టి తిండి ప్రేమతోడ
చేసినట్టి మేలు చెలిమి మనస్వికి
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఉన్న రోజు నీవు ఉయ్యాల లూగిన
హాయి యందు రయ్య యాకసాన
గాలి పటము తెగిన కలదె తోకకు విల్వ
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చేత కాక నొకడు చెక్కెను రాతిని
వస్త్ర హీన మైన ప్రతిమ వోలె
దాని జూచి జనులు ధ్యానమ్ము మరతురే
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎన్నడో పొరపాటు నెంతటి ధీమంతు
డైన చేయ వచ్చు నందు వలన
ప్రతి దినమ్ము వాని పట్టి పల్లార్చకు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

హద్దు నెఱిగి నీకు నంతరంగమ్మైన
నున్న సత్వ మెరిగి యుద్య మించు
నేల పైన తరువు కూలిన లేచునా
విశ్వ శాంతి కోరి విను మనీషి.

విద్య నభ్యసించు విలువైన కాలాన
రాజకీయ వాది రచ్చలోన
పలుకు మాట లెల్ల తలపకు మదిలోన
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పనిని చేయ సిద్ధ పడి నిల్చిన మనిషి
దారి గాంచ లేక ఘోరమైన
ఆకలి గొని యున్న నన్న మిడుట తెస్స
విశ్వ శాంతి కోరి నిను మనీషి.

దినము కూలి కేగి ఘనమైన కష్టము
చేసి పొందు రూక చిత్తమునకు
శాంతి నిచ్చు దొంగ సంపాదనన్ విడు
విశ్వశాంతి కోరి విను మనీషి

పని యొనర్ప సిద్ధపడి నీవు నిల్చిన
పొట్ట చూచి నీకు పెట్టు వారు
దొరకకున్న నీదు తెరు వేమి యగునకో
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పెట్టు వారి చూచి బిచ్చమే వృత్తిగా
తలచి జోలె బట్టి నిలువ రాదు
దాని విడువ వలయు ధర నభిమానివై
విశ్వ శాంతి కోరి విను మనీషి.

భూరుహమ్ము లిచ్చు పుష్ప ఫలమ్ముల
వారిదమ్ము లిచ్చు నీరములను
సభ్యమైన మనిషి జగతికి మేల్గూర్చు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

మనిషి స్వార్థ బుద్ధి మద మత్సరమ్ముల
వీడి లోక హితము వెలయ జేయ
జ్ఞాన దీధితు లయి జనియించె మతములు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పరులు జేసి నట్టి దురిత కార్యములను
గుండెలోన దాచి కుముల వలదు
అగ్ని మాడ్కి వాటి హరియింప హరి మెచ్చు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

మంచి యెక్కడున్న మదిలోన గ్రహియించి
దాని మెచ్చి కాచ దలచకున్న
కోకిలమ్మ బిడ్డ కాకుల పాలగు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఉన్న నాడు రూక లన్నియు తగలేసి
లేనినాడు నీవు లేకి వగుచు
పరుల నడుగ వారు పడి పడి నవ్వరే
విశ్వ శాంతి కోరి విను మనీషి.

నీవు చేయు పనులు నీ వారి కక్కర
రాక యున్న నట్టి పోకడేల
వెన్నె లడవి గాయ వెలు గింటి దీపమా
విశ్వ శాంతి కోరి విను మనీషి.

మనిషి యాత్మ శక్తి మహి వాడగా వలె
కాక యున్న నద్ది గళిత మగును
పరువు లెత్తు నదిని బంధింపకుందురే
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ప్రతి దినమ్ము నీవు బ్రతికి చచ్చుట కన్న
ఒక్క సారి పోవ నుర్వి మెచ్చు
దైవ ఘటన యంచు తలపోతు రందరు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

నమ్ము మీ చరాచరమ్ముల లో నున్న
స్వామి పరిమితమ్ము సకల వస్తు
కోటి కవల వెల్గు మేటి యనంతుడు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

గురువు నీకు దారి గురుతుగా జూపించు
దొడ్డ మనిషి యైన తొలగు నఘము
అటుల గాకయున్న నంటును పాపము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఇంద్ర జాలము వలె నిది మార్గమని చెప్పి
మాయ జేయు వారి మాట వినక
జగతి లోన వెలయు సత్యము నెఱుగుము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

మరల మరల భూమి తిరుగుచు వెలిగెడు
దినకరునకు చుట్టు తిరుగు నటుల
నిరత మీవు కర్మ మరువక చేయుము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

వైద్య వృత్తి చేయ పట్టను చేపట్టి
డబ్బు కక్కుర్తితో జబ్బు హెచ్చ
చేసి యంతు చూచు జీవుడే యసురుడు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

న్యాయ వాద వృత్తి నాదంచు నల్లని
కోటు తొడిగి లోని కుటిలమైన
తర్క బుద్ధితోడ ధర్మమ్ము పీడకు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

చేయు వస్తు వెటుల చెడినను నాకేమి
నాకు సొమ్ము వచ్చె పికె వరకు
ననుచు మురియు వాడె యసురుడు ధరలోన
విశ్వ శాంతి కోరి విను మనీషి.

వృత్తి యేది యైన సత్తును తెలియక
పలుక వలదు ధర్మ పథము వీడి
కర్మ సాక్షి చూచు ఘనమైన కంటితో
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పూట గడుచునంచు బుద్ధి పుట్టిన దారి
పోయి పచ్చి గడ్డి మేయరాదు
కడుపు నిండు నంత కాలము మూడును
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పిల్ల లెక్కువైన బీదరికమ్ము నీ
ఇంట తాండవించు నెల్ల జనులు
కూడు గుడ్డ లేక గోడాడి పోదురు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పాత యప్పు దీర్చ పైకమ్ము లేదని
క్రొత్త యప్పు లేల తెత్తు వన్న
తీర్చ లేని యప్పు దేశానికే ముప్పు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పరులు చేసినట్టి మురిపెపు మౌ వస్తువుల్
తెచ్చి ప్రజల కమ్మి దేశమందు
నున్న ప్రజల వృత్తు లన్నియు గూల్చకు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఎదుటి వాడు నీకు హితమును పొనరింప
వాని సాయ మంది వరలి యంత
వాని కొంప కెసరు పూని పెట్టగ రాదు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

విద్యబోధ చేయు వృత్తి చేపట్టిన
ఎరుగ వలయు శాస్త్ర సరణి లోక
రీతి వినెడు వారి చేతపు సత్వము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

శాస్త్రమెల్ల నీవు చదువుకొన్నను దాని
సార మెరిగి లోక సమ్మతముగ
ఎఱుగ గోరు వారి కీవు పంచవలయు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

గాలి వీచ పూలు నేలకు రాలును
మలయ మారుతము సుమాల పరిమ
ళమ్ము జిమ్ము చేయరా పని సులువుగా
విశ్వ శాంతి కోరి విను మనీషి.

అన్ని ధర్మములకు నాద్యము దేహ సం
రక్షణమ్ము దాని రాణ కొరకు
పరగ యోగ నియతి వ్యాయామ మొనరించు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

నీదు జ్ఞానశక్తి నీ యాత్మశక్తియు
నింటి పరిధి లోన హీన మైన
విశ్వ వీథి నెటుల వెలిగించు దీపము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

గుండె గాయములతొ మండెడు వారికి
హాయి గూర్చ మందు పూయ వలయు
కాక యున్న నగ్ని కణములు పుట్టును
విశ్వ శాంతి కోరి విను మనీషి.

తస్కరించి పరుల ధనమును హరియించి
గుండె కాయ కోత కూర్చ తగదు
కాలము నిను చూచు కలిగించు వెనుచేటు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పరులు చెప్పి నట్టి పలుకుల యందలి
సత్యమెఱిగి యాత్మ శక్తి తోడ
పని యొనర్ప వలయు భద్రమౌ మార్గాన
విశ్వ శాంతి కోరి విను మనీషి.

అర్థ కామముల సమర్థత గెలువంగ
వలయు నటులగాక వసుధలోన
ధర్మ మోక్షములను తలపెట్టు తఱి రాదు
విశ్వశాంతి కోరి విను మనీషి.

ఆలు బిడ్డ లెపుడు నడ్డము బంధాలు
నంచు నెంచ బోకు మద్ది కల్ల
తెలియు మయ్య వారు దేవుని రూపాలె
విశ్వశాంతి కోరి విను మనిషి.

ఇంట నున్న యట్టి యిల్లాలి ముచ్చట
చూడ కాశ తోడ చుక్క లన్ని
లెక్క బెట్ట దలచ చిక్క వున్నది పోవు
విశ్వ శాంతి కోరి విను మనిషి.

గమ్య మొకటి యెంచు కలసి పోదామనును
వెంట వచ్చు భార్య విడువరాని
తోటి బాట సారి ద్రోహమ్ము చేయకు
విశ్వ శాంతి కోరి విను మనిషి.

పిల్ల లెల్ల నీకు నుల్లము రంజిల్ల
జేయు బొమ్మ లైరి చిన్న యపుడు
పెద్ద యైన కొఱవి పెట్టెడు వారైరి
విశ్వ శాంతి కోరి విను మనిషి.

రుచుల నెరిగి వంట పచరింపగా లేక
తినెడు వారి కర్మ యనగ రాదు
అన్ని సాధనముల కన్న మేలైనది
విశ్వ శాంతి కోరి విను మనిషి.

భర్త హృదయ మెఱిగి భార్య యుండగ వలె
భార్య మనసు నెఱిగి భర్త చేయ
వలయు వారు రెండు బండి చక్రమ్ములు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

పెద్దవారి జూచి పిన్నలు నడతురు
వారి నడత పలుకు తీరు వేష
మెల్ల స్వచ్ఛమైన నిలకును మేలగు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ఆత్మ నియతి లేక నన్ని దుర్వృత్తుల
జేసి సూక్తు లెల్ల జెప్పు వారి
యుల్ల మెఱుగు వార లుందురే భువిలోన
విశ్వ శాంతి కోరి విను మనీషి.

వేద శాస్త్ర సర్వ విజ్ఞాన సంపద
మనిషి మేలు గోరు మంచి పెంచు
ప్రాణి లోని దానవత్వము జంపును
విశ్వ శాంతి కోరి విను మనీషి.

అంత రార్థ మెరిగి యభ్యాస మొనరించి
నట్టి విద్య మనిషి కాత్మ శుద్ధి
కలుగ జేయు నద్ది ఘటియించు సంస్కృతిన్
విశ్వ శాంతి కోరి విను మనీషి.

మనసు స్వచ్ఛమైన మాటలు సుధనొల్క
ఆత్మ లోన దైవ మవతరించు
చేయు కర్మ ప్రజకు క్షేమ కరంబగు
విశ్వ శాంతి కోరి విను మనీషి.

ధర్మ రక్షణమ్ము ధరలోన జేయగా
మనసు వాక్కు తనువు మనిషి కున్న
మూల ధనము కర్మ ముదముతో జేయుము
విశ్వ శాంతి కోరి విను మనీషి.

సకల వసుధ శాంతి సముపేత యగుగాత
పాడి పంట లెల్ల వఱలు గాత
రమణి గౌరవమ్ము రక్షింప బడుగాత
జగతి మంగళమ్మె జరుగు గాత.